శ్రీ సూర్యరత్న గ్రంథమాల. 4వ. కుసుమము.

# శంకర శతకము.

కీ॥ శే॥ చామర్తి శంభులింగకవి
ప్రణీతము.

మొదటికూర్పు.

శ్రీ

వేణుగోపాల ముద్రాక్షరశాల వారిచే ముద్రించి
ప్రకటింపబడియె.

విజయనగరం సిటీ

1932.

 [వెల. రు 0-2-0

# శంకర శతకము.



శివలింగమూర్తి మునిబృందమనఃకమలాంతవర్తిల
క్ష్మీశసమర్చితాక్షశశిజేద్ధసమానమృదుపాదయుగ్మ సం
కాశకభవ్యకీర్తిభవ ♦ కానన సవ్యకతారహార్తి వా
గీశ సురేశవందిత గ్రహా♦తీరిత చిద్గుణపూర్తి శంకరా॥

శా॥ ఆర్తత్రాణపరాయణప్రచుర కా ♦ ర్యామోదితా శాంతస
త్కీర్తిన్ మౌనిచయప్రబోధిత మహా ♦ దివ్యాగమాంతోల్లస
ద్వర్తిన్ శుభ్రపటోద్విజస్థిత కన ♦ ద్వైరాగ్య[illegible]న్ దక్షిణా
మూర్తిన్ బూజనొనర్తు డెందమున నే♦మున్మున్నుగా శం॥ 2.

ఉ॥ కృష్ణుని నీలమేఘరుచి ♦ కేవలగాత్రిసముంచితార్కరో
చిష్ణుని వందితాబ్జభవ ♦ జిష్ణుని వేణురవప్రగానవ
ర్ధిష్ణుని గోపికాకుచవి ♦ లిప్తమృగీమదపంకసిక్తహృ
త్కృష్ణుని దీనపోషణవ ♦ రిష్ణుని సన్నుతిజేతు శంకరా॥ 3.

ఉ॥ చేతులుమోడ్చి మొక్కెద న ♦ శేషచరాచరభూతకల్పన
ఖ్యాతకు వేదచోదితకు ♦ యజ్ఞహవిర్విహితభోజనైక సం
ప్రీతకు వాక్సతీహృదయ♦ తామరసభ్రమరాయమాన సం
స్థాతకు విశ్వనేతకు వి ♦ ధాతకు సన్మదమార శంకరా॥ 4.

ఉ॥ ఏణకిశోరపాణి హృద ♦ యేశ్వరినా జెలువందియున్న శ
ర్వాణికి సేవితాంబుజభ ♦ వప్రముదాబ్ధిసుతాదిముఖ్యగీ
ర్వాణికి భక్తమానస వి ♦ రాజితనీరజవాసితోరు రు
ద్రాణికి వందనంబు లిడె♦దన్ గృతిసిద్ధినిగూర్చి శంకరా॥ 5.

చ॥ అతిశయభక్తిగొల్చెద మ ♦ హత్తరకావ్యధునీతరంగ భా
రతికి విరించిహృద్వనజ ♦ రాజితపీఠనితాంతవాస వా
క్సతికి శ్రితేష్టదోన్నతికి ♦ సర్వసుపర్వకృతత్రియావచ
స్తుతికి దయారసోన్నతికి శుభ్రతరాకృతికేను శంకరా॥ 6.

ఉ॥ ప్రీతిజెలంగ దండములు ♦ బెట్టెద దుగ్ధపయోధిగర్భసం
జాతకు భక్తలోక విల ♦ సత్పరిపాలనవీక్షణామృతో
ద్భూతకు విష్ణుహృత్కనక ♦ పుంజనుపీఠకృతోల్లసజ్జగ
న్మాత కహీనతందగు ధ♦నంబొసగన్ వినుతింతు శంకరా॥ 7.

ఉ॥ కంబుగళార్యమానసను ♦ ఖాస్పదఖేలనదీపితక్రియా
లంబుని సర్వకార్య విర ♦ ళస్తుత భక్తమనోంబుజాత రో
లంబుని భవ్యతుండకబ ♦ ళప్రథితోన్నతవస్తుభోజ్య హే
రంబుని సన్నుతించెద చి♦రంబును సత్కృతిగోరి శంకరా॥ 8.

ఉ॥ ఆదరమొప్ప గేల్మొగుతు ♦ నద్రిసుతాధిపపాదపూజనా
హ్లాదికి దేవకార్య సఫ ♦ లప్రియకారణతంత్రిగోచరా
మోదికి శైవభక్తజన ♦ ముఖ్యగణావనహృత్ప్రయోజ శై
లాదికి సుప్రసాదికి ఖ ♦ లవ్రజభేదికి నింక శంకరా॥ 9.

శా॥ క్షుద్రప్రాకృతదక్షయజ్ఞహతదో ♦ శ్శూరాహవోత్సాహిత
చ్ఛిద్రుఁ నైజకృధాప్రజన్యలలిత ♦ స్వేదోద్భవాహీనస
ద్రౌద్రుఁ భూతభయాశ్రితావనకృపా ♦ రత్నాకరాభంగచి
న్ముద్రుఁ దల్చెద వీరభద్రు నెద స♦మ్మోదంబుగా శంకరా 10

ఉ॥ బాణ మయూర బిల్హణుని♦భాస్కర సోమన తిక్కనాంధ్రగీ
ర్వాణ కవీంద్రశేఖరుల ♦ వాసిగనెంచి ముదంబుదోప ని
ర్మాణము జేతు పద్యములు ♦ మత్కృతికైకొని బ్రోవుమయ్య శ
ర్వాణీమనోజ్ఞసద్విబుధ ♦ వందిత కామవినాశ శంకరా॥ 11

ఉ॥ ఆర్యజనోత్తమాన్వితు డ ♦ హంకృతిదూరు డుదారు డుద్భటా
చార్యపరంపరాగత సు ♦ శైవమతప్రథితుండు సత్యతా
త్పర్యయుతుండు శాంతుడును ♦ దాంతుడు శ్రీముదిగొండనాగలిం
గార్యుడునైన మద్గురున ♦ కంజలిజేసెద భక్తి శంకరా॥ 12

ఉ॥ తారపటీరహీరకల ♦ ధౌతశరీర తురంగకృచ్ఛ్రుతీ
వార భుజంగహార నిజ ♦ భక్తహృదబ్జవిహార దీనమం
దార వరప్రచార పర ♦ తత్త్వవిచార యఘాళిఘోరకాం
తారకుఠార ధీర వర ♦ దాయక సద్గుణధీర శంకరా॥ 13

ఉ॥ ఈశ జగన్నివేశ పర ♦ మేశ గిరీశ మహేశ ధర్మహృ
త్క్లేశ సురేశ మారమణ ♦ తోయజగర్భనుతాభ్రకేశసం
కాశ ప్రశస్తయోగికుల ♦ కాండమనోబ్జదినేశ దుష్టకీ
నాశదశావినాశ యము ♦ నానుజగర్వవినాశ శంకరా॥ 14

ఉ॥ మిత్రసుధాకరానలస ♦ మీహితనేత్ర పవిత్ర దక్షకృ
త్సత్రవిఘాతఫుత్ర కల ♦ ధౌతమహీధరయాత్ర సత్యస
త్పాత్ర వృషేంద్రపత్రవర ♦ తత్త్వచరిత్ర సితాభ్రఫేనస
ద్గాత్ర శివాంకళత్ర మద ♦ దానవజైత్ర విచిత్ర శంకరా॥ 15

ఉ॥ దోషహతప్రపోష ఖల ♦ దుష్టమదక్షణదాపహారసం
తోష పరార్ధవిత్కులమ ♦ నోంబుజతోష సుతారకాధిపో
ష్ణీష మనోజ్ఞవేష హరి ♦ ణీధృతపాణివిశేష తత్త్వవి
ద్యూ్యాషపరత్వభాష పర ♦ మోరగనాయకభూష శంకరా॥ 16

ఉ॥ దక్షకు యజ్ఞశిక్షనత ♦ తామరసాక్షకు త్ర్యక్షభూతిరు
గ్రాక్షవిలిప్తవక్షవిబు ♦ ధేంద్రమురారిముఖామరాంచితా
ధ్యక్ష గతాపరోక్ష వర ♦ దక్షవిరూక్ష బలారిజైత్ర కృ
ద్దక్ష శ్రితాళిధేయ పర ♦ తత్త్వ వివిక్తసుభిక్ష శంకరా॥

ఉ॥ భూతదయాసమేత వర ♦ పుష్కరసంభవసూత దైవ వి
ఖ్యాత జగద్వినేత శ్రిత ♦ కమ్రసుతిరామృతవాత సచ్ఛ్రుతీ
శ్రోత మదాదిఘాత వర ♦ సూనృతవాగ్ర్యవినీత భక్త సం
త్రాత వరప్రదాత పర ♦ తత్త్వపరీతమనోజ్ఞ శంకరా॥ 18

ఉ॥ దేవ మహానుభావ శివ ♦ దీకృతతత్త్వగుణానుభావ శ్రీ
గ్రీవ మునీట్కదంబ సుర ♦ కిన్నరసేవ స్వభక్తరక్ష స్వం
జీవ స్వకీయభక్తగణ ♦ చిత్తసరోజగృహా స్వభావ సం
భావితశైవ వేడెదను ♦ పల్మను సత్కృపబ్రోవ శంకరా॥ 19

ఉ॥ భీమ సురాభిరామ వర ♦ భీకరదైత్యవిరామ మాళిభృ
త్సోమ గిరీంద్రధామ సుర ♦ సూదనసన్నుతనామ ధామము
త్రామముఖామరోత్కరల ♦ లామ సద్గుణభక్తయుక్త సం
స్థోమ సదగ్ధకామ సువ ♦ ధూకృతసంతతవాము శంకరా॥ 20

ఉ॥ శీల సురాళిపాల ముని ♦ శేఖరమానస ఖేల యాశ్రితా
వాలకళావిశాల ఫణి ♦ హారవిభూషణజాల భంగి కృ
త్కాలహలాహలాన్వితసు ♦ కంధరమూల కసత్సుషక్రసూ
భీల కరాబ్జశూల పృథి ♦ వీధరజాత్మసిలోల శంకరా॥ 21

ఉ॥ బాణనుతప్రవీణ నిజ ♦ భక్తజనప్రచయాశ్రితౌఘస
త్రాణ సముద్రితూణ మక ♦ రధ్వజదర్పవిశోషణా ముని
భూరిణ భయాపహృత్కరణ ♦ భూరితరస్థితపంచకోణ క
ల్యాణగుణప్రమాణ సర ♦ సామృతవాక్యధురీణ శంకరా॥ 22

ఉ॥ భక్తజనానురక్త నిజ ♦ ఫాలహుతాశనయుక్త తత్త్వసం
వక్త శిరీతాళికృన్మఘుసు ♦ వైభవభోక్త యరీష్వముక్త స
ద్వ్యక్త జనావనైకగుణ ♦ తత్పరసక్త విమప్రభుక్త స
న్మక్తిరమాంగసంగతవి ♦ నోదమహాత్త్రరసూక్త శంకరా॥ 23

ఉ॥ లింగ శివానుషంగ విద ♦ ళీకృతపాపతమఃపతంగ స
త్పుంగవరాట్తురంగ ఫణి ♦ భూషితదివ్యశుభాంగ సాగరో
త్తుంగ నిషంగమస్తకధృ ♦ తోత్కరపుష్కరగంగ హస్త సా
రంగ శృతిప్రసంగ ముని ♦ రాజమనోంబుజభృంగ శంకరా 24

ఉ॥ పోషితనాకలోక కర ♦ పుష్కరసంభృతసత్పినాక సం
శోషితదైత్యయూక శృతి ♦ సూత్రితభాష్యవివేక వాహకృ
త్పోషితపుండరీక ముని ♦ పూజితపాదపయోరుహైక సం
తోష కరానకప్రథిత ♦ దోర్బల గోపపతాకశంకరా. 25.

ఉ॥ వేదనుతప్రమోద వర ♦ వీరహృదంతరఖేద సంతతా
హ్లాద వరప్రసాద త్రిపు ♦ రాసురభేద శివాప్రసీద సం
వాదపరప్రమాద ప్రణ ♦ వప్రథితాంచితనాద భక్తసం
పాద కనత్సుపాద నిజ ♦ వాహకృతాంచితవేద శంకరా. 26.

ఉ॥ తాపసచిత్తదీప ఘన ♦ తాండవనాట్యకృతప్రతాప సం
దీపిత భూతిలేప గిరి ♦ దివ్యనుచాప కృతారితాప చి
ద్రూప నతాంఘ్రిగోపలయ ♦ రూక్షణకోప ప్రణమ్యభూపసం
త్రాపిత గంధలేప వర ♦ భస్మకృతాఖిలపాప శంకరా. 27.

ఉ॥ పాలితనాకలోక కర ♦ పద్మసదంకత్రిశూల బాలవా
క్షీల సుభక్తయుక్తవాత ♦ శేముషిదానవగోత్ర జైత్రచి
జ్జాలనుతత్వ సత్వసుర ♦ సన్నుతదివ్యచరిత్రగాత్ర స
త్కాలకళావిశాలఘన ♦ తాండవకేల సుశీల శంకరా. 28.

ఉ॥ శైవజనానుమోదములు ♦ సాధుజనాత్మగత ప్రమోదముల్
భావజగర్వతూలవహ ♦ పావకతుల్య దృగంతభేదముల్
కేవలసుప్రసాదములు ♦ గీష్పతిసన్నుత వేదపాదముల్
పావనమైన తావక సు ♦ పాదములాత్మభజింతు శంకరా 29

ఉ॥ శరణము లార్యమానసిక ♦ శార్వరపాటనకృత్ప్రభాకరః
కిరణము లంబుజేక్షణ సు ♦ గీర్ధవముఖ్యసురార్చితాంచిత
స్ఫురణము లాశ్రితావనవి ♦ భూతిసమన్వితతావకీన స
చ్చరణము లాశ్రయించెదను ♦ శాశ్వతబుద్ధియొసంగుశంకరా. 30

ఉ॥ పాత్రము దుష్కృతవ్రజవి ♦ పద్ఘనభూరికఠారతారక
క్షేత్రము భవ్యరత్నమణి ♦ కీలితముక్తిసుముకుటపాదిద్య
కూస్త్రాత్రము భక్తకర్ణపుట ♦ శోభితమోదవిమగ్న తావక
స్తోత్రముసేతు నన్ను కడ ♦ జూడకబ్రోవుము వేగ శంకరా. 31

ఉ॥ ధనము ముముక్షుయోగిజన ♦ ధ్యానసమంచిత మోక్షమార్గసా
ధనము ముకుందజిష్ణుముఖ ♦ దైవకదంబ నిజాంచితాత్మబో
ధనము సమస్తభూతిఫల ♦ దాయకమైజెలువొందునీదు ప్రా
ర్థన మొనరింతు నిన్నుగను ♦ దారివచింపుము వేగ శంకరా. 32

ఉ॥ భవములలోననుత్తమము ♦ భాసురవిప్రకులంబు యందు పుం
భవ మధికంబనంబరగు ♦ భవ్యతరంబగు నిట్టి యగ్రసం
భవములభించె నిప్పుడెడ ♦ బాయనిభక్తినెత్తుతు మీదటన్
భవములులేమిజేశి తవ ♦ పాదసమీపముజేర్చు శంకరా. 33

మ॥ కరుణాంభోధిధునీనితాంతవిలస ♦ త్కల్యాణధామంబులై
స్ఫురణానందితభక్తసంచయకర ♦ స్తోత్రాభిరామంబులౌ
చరణాంభోజములన్భజింతు నెపుడున్ ♦ శశ్వన్మహోవాక్యముల్
స్మరణాన్ముక్తి యటంచుజెప్పబడుటన్ ♦ స్వాంతంబునన్ శంకరా.

ఉ॥ నిర్ధనవంతులైన తమ ♦ నేర్పులచే నతిథిన్ ముదంబునన్
ప్రార్థనజేసి లేదనక ♦ భక్తినిశక్తిగొలందినిచ్చి వే
సార్థకమొప్పసేయదగు ♦ జన్మ భువిన్ ఘనతన్ పరోపకా
రార్థమిదంశరీరమను ♦ నట్టి సునీతినిబూని శంకరా. 35.

ఉ॥ మానవులిమ్మహాస్థలిని ♦ మానితవిత్తసుఖాభిలాషులై
ప్రాణమునిక్కమంచు పరి ♦ పాటిగధర్మమునున్నబెట్టలే
కాని. నిరంతరం బతిధి ♦ కన్నఖిడంబడజాలరా 'యని
త్యానికళేబరాణి' యను ♦ సర్ధముసాటుచునుండ శంకరా. 36

చ॥ నరులిలజేయగాదగదు ♦ నర్మిలిహింసలు ప్రాణికోట్లకం
చురువడి వేదముల్ బలుకు ♦ యుక్తి 'నహింసపరంసధర్మ' మం
చరుదుగగాస సంతతము ♦ నాత్మ శరీరముభంగి ప్రాణుల
న్నిరతము సత్కృపన్మనుప ♦ నీతియొసంగుము వేగశంకరా.37

ఉ॥ తామసమబ్బ గర్వమును ♦ తాల్మివిహీనత నొర్లకల్మిజూ
లేమియు పూగుషాధముని ♦ లేతగుణంబులు గాన వాని గో
ష్ఠీనులినాత్మజేయక వ ♦ శీకృత సత్వగుణానువర్తనో
ద్దాముని జేశి భక్తజన ♦ దాస్యమొనర్పగజేయు శంకరా. 38

ఉ॥ బక్కవికెన్నడుంగగని ♦ భక్ష్యఫలాధిక భోజనంబులున్
పెక్కడు సుప్తినొందుతరి ♦ ఛీతిదొలంగగ జాగరూకుడై
సొక్కచునుంటయున్ లలిత ♦ శోభనకార్యవిచారణాప్తియున్
డక్కన సత్యవర్తనకు ♦ దారియనందగదంచు నీతినీ
షక్కనిబల్కునార్యులటు ♦ బాయక జేతురుగాక శంకరా. 39

ఉ॥ యోగముబూని దృగ్యుగము ♦ లొప్పుగ నిశ్చలయుక్తిజేర్చిసం
యోగగుణత్రయంబులను ♦ నొప్పగు చిత్తచతుష్టయంబులన్
బాగుగనాపి మైదిటిని బట్టుచు నారిటిబుచ్చియేడిటిన్
వేగమరల్చి నిన్నుగను ♦ వేత్తలజేర్పుము నన్నుశంకరా. 40

ఉ॥ కలుషములాచరింపము వి ♦ కారమనంబుల నిష్టగోక్తులం
బలుకడు దన్నునూనముగబల్కి ♦ నగాని నిజాత్మలో తమం
దొలగడు జెల్లియుండియును ♦ దుర్జనులన్వధియింప దర్థులన్
కొలదిని తృప్తిజేయు నిజ ♦ కూర్మిని నుత్తముడిట్లుశంకరా. 41

ఉ॥ శాంతమతుల్ పరంబయిన ♦ శంభునితత్త్వముదెల్ప పిట్టవే
దాంతములంచు దుర్జనవి ♦ తానములున్ పరిహాసమాడ గో
రంతయు తక్కువైన పురి ♦ రాజితవీధుల జంగమావళుల్
కొంతజరింప శ్వానములు ♦ కూతలుబెట్టెడురీతి శంకరా. 42

ఉ॥ ఉల్లమునందు మీపదము ♦ లొయ్యనజేర్చి మతల్లికాంబుజో
త్ఫుల్లసుమంబులన్విమల ♦ పూజలుసల్పుచు ధాత్రియంతయున్
కల్లయటంచు నిశ్చయము ♦ గాగ గ్రహించెడి పూరుషుల్ జగ
ద్వల్లభ నిన్నుజెందెదరు ♦ వారిధిఫేనములట్లు శంకరా. 43

ఉ॥ శివ యను వర్ణయుగ్మమును ♦ జిహ్వనుబల్కినమాత్రనే మహా
భవములు గ్రుంగునంచు శ్రుతి ♦ బల్కుట నిక్కముగాదలంచి ను
స్తవములొనర్తు నన్నిపుడు ♦ ధన్యునిగాగ ననుగ్రహింపు దు
స్సవనవినాశ దేవదను ♦ జార్చిత నిర్మలరూప శంకరా. 44

ఉ॥ కృతయుగమందు ధర్మమిల ♦ కేవల పాదచతుష్టయంబులన్
రతినివహించు నందుగల ♦ బ్రాహ్మణ రాజ విశాదులేక వే
దత రహి నొప్ప వారలనా ♦ దప్పక చక్రి సితాంగరూపుడై
సతతము నీదుశాసనము ♦ సల్పుచు బ్రోచుజగంబుశంకరా. 45

ఉ॥ ధర్మము మూడుపాదముల ♦ దప్పక త్రేతయుగంబు వర్తిలన్
మార్మవిహీనులై జనులు ♦ మానిత సత్యతపఃప్రదాన స
త్కర్మకులయ్యు యజ్ఞము లు ♦ దారతరక్రియజేతు రందు స
ద్ధర్మత విష్ణురక్తతను ♦ డై ప్రజమన్చునగాదె శంకరా. 46

శా॥ ద్వాపారంబున ధర్మమున్నత సుపా ♦ దద్వంద్వమా వేదముల్
దీపించున్దగ నాల్గురీతులను సం ♦ దేహంబులేకన్ జనుల్
రూపొప్పంగ సకాములై క్రతువులన్ ♦ యింపారజేయన్ లస
చ్ఛ్రీపాలుండును కృష్ణవర్ణమున ర ♦ క్షించున్గదా శంకరా. 47

చ॥ కలియుగమందు ధర్మమెస ♦ గొబడి యేకపదప్రమాణమై
నిలువ జనార్దనుండు ధర ♦ ణిన్దగ బ్రోచును బుద్ధరూపుడై
సలలితకాంక్షచే జనులు ♦ సల్పెద రాహవనీయమాదిగా
గల మఖముల్ ఫలార్థులు స ♦ కాములునై విలసిల్లి శంకరా.

ఉ॥ వందనమాచరించెద భ ♦ వన్నిజరూపముజూపి యాత్మ కా
నందముజేయనెన్న విడ ♦ నాడుదునంచు దలంచియుందువా
సందియమెల్లబాసియు గ ♦ జాననషణ్ముఖులట్లు నన్ను నీ
నందనుగాగ జేకొన మ ♦ నంబునదల్పగదయ్య శంకరా. 49

చ॥ తను ధన రూప యౌవన మ♦దంబలువారుదలంచి మెచ్చి స
జ్జనులనుజూచి హేళనము ♦ సల్పుటయున్ యుపకారమించుకై
నను బచరింపనొల్లని జ ♦ నంబుల సంగతిబాపి నీ పదా
ర్చనపరతంత్రవర్తన చి ♦ రంబొనగూర్చుము దేవ శంకరా. 50

ఉ॥ వీరు మదీయబాంధవులు ♦ వీరుహితుల్ సుతులున్సహోదరుల్
వీరు కళత్రమిద్దియని ♦ వెర్రితనంబున భ్రాంతిజెందినన్
వారు ఘటాంతమందు తన ♦ ప్రాణముగల్గుతరిన్ యొనర్చు స
త్కారము మోక్షహేతువశ♦తన్ దగియుండు ధరిత్రి శంకరా.

ఉ॥ కాంచెద మీ శుభాంగములు ♦ కన్నులపండువుగాగ నేడుపూ
జించెద శంభవేయనెడు ♦ శ్రీకరనామమునుందలంచి సే
వించెద వారణాశిపురి ♦ విశ్వపతిన్ గురురూపుగాగ భా
వించెద 'సోహ'మంచు పృథి ♦ వీధరనాయకచాపశంకరా. 52

శా॥ రామేశాదిమహాస్థలంబులను ని ♦ ర్మాంగల్యరూపున్ శివున్
కామారిన్ కడుభక్తి నిల్పివిలస ♦ ద్గాంభీర్య శుంభద్గతిన్
గాముండెవ్వాడు పూజసల్పుటలుసా ♦ రంబంచునూహించుచున్
నీమాహాత్మ్యమెరుంగ లేనిమనుజుల్ ♦ నిందింతురౌ శంకరా. 53

చ॥ సిరిదొర తొల్లిశాపమున ♦ జిక్కి యనేకభవంబులెత్తి యం
దురుతరజన్మలన్ సతివి♦యోగమునొందునటంచు నంత నిన్
శరణముజొచ్చివేడ దశ ♦ జన్మములెత్తియు నందు నొక్కటన్
కరిగమనావియోగమును ♦ కల్పనసేయగలేదె శంకరా. 54

ఉ॥ శౌరిని మోహినీసతిగ ♦ సల్పి విలాసముగా ముదంబునన్
దారు వనంబుజేరి యట ♦ తాపసకాంతల భిక్షురూపతన్
మారశరప్రపీడిత భ్ర ♦ మాకులితాత్మలజేసి మానులం
జేరి శివైక్యబోధకుల ♦ జేయవె సత్కృపతోడ శంకరా. 55

ఉ॥ ఆదికి నాదినై యలరి ♦ నట్టిమహాత్ముడవంచు చక్రి యా
పాదిలు వేయుపద్మముల ♦ భక్తిని నీపదసారసంబుపై
బ్రోదుగ పూజసల్పునెడ ♦ పుష్పమునొక్కటితక్కువైనచో
నీదుమహత్వమంచునిజ ♦ నేత్రసమర్పణజేసె శంకరా. 59

చ॥ హరియు నజుండు నీదయిన♦మైదుశిరంబుల కాదిదెల్పగా
సురుగతి పంతమూని యధ♦రోర్ధ్వపథంబుల పెక్కుయోజనాం
తరములకేగి యందు గన ♦ దారియెరుంగక మోసమొంది స
త్వరముగమిమ్ము వేడ విశ ♦ దంబగుదర్శనమీవె శంకరా. 57

చ॥ యుగగణనార్ధమై కమల ♦ యోని ముకుందుల జీవితాంతమం
దొగిని తదీయ శల్యముల ♦ నొప్పుగగూర్చి సరంబులన్మహా
జగదుపకారణార్ధముగ ♦ సంతతముం ధరియించితౌట సొం
పుగ దెలియంగలేక శుభ♦భూషణదూరుడవండ్రు శంకరా. 58

మ॥ కమఠంబై జలరాశిగూలిన గిరిన్ ♦ గన్పింప వేడెల్చి యు
త్తమతంజెందిన చక్రి తద్భవవిష ♦ ధ్వంసంబు దా జేయగా
సుమతింజాలమి జూడ నీకరుణచే ♦ శోభిల్లెగా కమ్మహీ
రమణుండెట్లు పరుండునాబరగు నా ♦ రాధ్యంబుగాశంకరా. 59

చ॥ ఘనమగు పూర్వజన్మకృత ♦ కర్మము మానదు ధాత్రినెంత స
జ్జనులకు నేనియున్ ప్రథిత ♦ చారు వివేకికి నేని యెట్లనన్
జనకసుతాపహారుడన ♦ జాలి వనంబులలోన గుందడే
యినకులజాతుడౌ దశర ♦ థేశ్వరరాజసుతుండు శంకరా. 60

ఉ॥ ఎంతటిమంచివాడయిన ♦ నిమ్మహి కొందరికైన వైరియౌ
టంతనిజం బదెట్లన హి ♦ మాంశుడు చల్లనివాడటంచు కీ
ర్తింతురు నాతడట్టులనె ♦ దివ్యుల కమృతదాయియౌచు దా
పంతమొకాక నక్కమల ♦ వైరియనంబడె మున్ను శంకరా. 61

ఉ॥ ఆపదకోర్వకన్ సుఖము ♦ లబ్బవు నెందును పాండవుల్ జగ
ద్దీపితధర్మబాహుబల ♦ ధీయుతులయ్యును ధార్తరాష్ట్రుచే
ద్రౌపదిమానభంగమును ♦ దారుణకాననచర్యయాది సం
తాపములొందియున్ పిదప ♦ ధారుణినేలరె తొల్లి శంకరా.62

ఉ॥ చంద్రకిరీట యేరికిని ♦ శక్తి నిమించిన ధార్మికంబుచే
సాంద్రవిపత్తుగల్గుటయె ♦ సత్యమదెట్లన మున్ సమస్త ధా
త్రీంద్రులలోన మేటియని ♦ దివ్యులచే నుతినొందియున్ హరి
శ్చంద్రుడు యట్టిధర్మమున ♦ సౌఖ్యవిదూరుడుగాడె శంకరా. 63

చ॥ పురహరనీకృపారసము ♦ పొందిన మోక్షరమావిభూతి చే
కురుటది యెంతవింత ముని ♦ కోవిదు డంతకరాజధాని స
త్వరముగజేరి దక్షిణపు ♦ వాకిలి నారక కోటికెల్ల నీ
వరయ ముహూర్తమాత్రభవ ♦ దంఘ్రుల జేర్పడె వేగ శంకరా.

చ॥ మునుపాక యాజ్ఞదత్తి యను ♦ భూసురు డంగజకేళిలోలుడై
జనకతిరస్కృతుండగుచు ♦ సద్మముబాసి తవాలయంబునం
ఘనమగు నీ నివేదనము ♦ గాంచిన తస్కరవృత్తిచే గ్రహిం
చినతఱినత్తిద్రోచుటను ♦ జేయ వెముక్తుసి వేగ శంకరా. 65

మ॥ మృగయాన్వేషణకై కిరాతుడుదగన్ ♦ బిల్వావనీజంబు బెం
పుగవేఁ బ్రాకియు పత్రముల్ దునిమి త♦ద్భూజంబుక్రిందన్వడిన్
దగవేవైచిన మీశిరోగ్రమున మో ♦ దంబొప్పపూజార్హమా
టగదా యబ్బెనుమోక్షమాతనికి చి♦త్రంబయ్యెడిన్ శంకరా. 66

మ॥ శివ నీదివ్యచరిత్రముల్ వినినబల్ ♦ చిత్రంబులై దోచు బో
యవరుండొక్కఁడు దారుణాటవిని వే♦టాడంగ బొల్పడ్డ ఘో
రవరాహాది మృగామిషంబులగుచుల్ ♦ బాటించి పక్వామిషం
బ విరూపాక్షునకంచు యెంగిలిడిసన్ ♦ భక్షించియమ్మూర్ఖునిన్
భవదాగారముజేర్చి బ్రోచితివిత ♦ ద్భక్తిట్టిదో శంకరా. 67

మ॥ ఇల భల్లాణనృపాలు డర్థులకు దా ♦ నిచ్ఛాభివస్తువ్రజం
బులువేనిచ్చెదనంచు భక్తినరయన్ ♦ భూజానిపత్నీమణిన్
వలనొప్పారగ గోరి రాబడసియున్ ♦ బాలుండవై స్తన్యపా
న లసద్దీప్తినిజూపి బ్రోచితివి దా ♦ నన్ చిత్రమా శంకరా. 68

మ॥ ఘన పంచాస్య నరావతారులు మదిన్ ♦ గర్వించిమత్తుల్యులెం
దును లేరంచు దలంచి భైరవ సుశా♦ర్దూలాకృతిన్ పంచమా
ననమున్ నన్నృగరూపమున్ దునుమనా♦టంగోలె నక్త్రాబ్ధులన్
గొనిలోకేశుడు గొల్వశౌరియు మిమున్ ♦ గొల్చెన్ గదా శంకరా

చ॥ దశశతవేల్పులుంగలరు ♦ ధారుణి గల్గగనేమి వారల
న్నిశి కలనైన గొల్వ ఫల ♦ నిర్ణయముల్మదిగోర నేమనన్
రశికులనంగనొప్పు చతు ♦ రానన విష్ణులకే యగణ్యమై
యశమునజెందితౌట భవ♦దంఘ్రులు నిత్యముగొల్తుశంకరా. 70

ఉ॥ మీ కరుణాంబురాశి నెరి ♦ మించియు నేనరునందుగల్గునో
ప్రాకటమొప్ప వారలక ♦ రంబున ముక్తినటించుటెల్ల భూ
లోకమునందు దృష్టము త♦లోదరియా నొక కుష్ఠు మాలకున్
గోకరణంబునందు తవ ♦ గోప్యపథంబొనగూడె శంకరా. 71

చ॥ సకల చరాచరంబులును ♦ సర్వజగంబులు దానవద్విష
న్నికరము యతిసిద్ధులు ము♦నీంద్రులు శక్తులు గోత్రసంఘముల్
ప్రకటముగాగ రుద్రమయ ♦ పంక్తులటంచు శ్రుతుల్వచింపగా
వికలమతుల్ ద్వైదన్యముగ♦వేడుట వ్యర్థముగాదె శంకరా. 72

ఉ॥ వనితలు విస్ఫులింగయుత♦వహ్నిసమానులు జూడ పూరుషుల్
ఘన ఘృతకుంభతుల్యు లటు♦గాన ఘృతంబును వహ్నిసోకువెం
టనె కరుగుంగదా కడు దృ♦ఢంబుగ మన్మన మెల్లకాలముం
మనసిజబారిలోబడక ♦ మాన్యులగోష్ఠికి జేర్చు శంకరా. 73

ఉ॥ ఓగిర మాత్మయాత్రకును♦యుక్తము సంగమమాత్మకాంతతో
బాగుఋతుర్దినంబులను ♦ భవ్యతరంబగు పుత్రసిద్ధికై
యాగములుం తపార్జనకు ♦ నంచితపల్కులు సత్యశీలతన్
దూగగ బల్కువారలకు ♦ దూరము దండధరాజ్ఞ శంకరా. 74

చ॥ నిరతము నంజలుల్ సలిపి ♦ నెయ్యమెలర్ప భజింపుచుండ నీ
బిరుదిటు దాచినావొ కృప ♦ పెంపుగ బ్రోవకయున్న నేడు నా
తరమె సమర్చనల్ సలుప ♦ తథ్యముగా నటుగాన నాపయిన్
కరుణను వెంటనంటినిజ♦కాయము జూపగదయ్య శంకరా. 75

చ॥ బిరుదువహించినాడనని ♦ బింకముబూనితివేని మత్కృత
స్ఫురదురుసన్నుతుల్ ధర న♦పూర్వములై దగు వృత్తరూపమై
నిరతము పాఠయోగ్యమగు ♦ నీతులచే జెలువొందజేయ ను
స్థిరముగ దీనరక్షణత ♦ దిట్టరివౌటతనంబు శంకరా. 76

ఉ॥ కాంచనశైలకార్ముకవి ♦ కాసనవర్తికి శంభుమూర్తికిం
మించినసాటిదైవములు ♦ మిధ్యయటంచు దృఢంబుగాగ సా
టించెద ముజ్జగంబుల ప♦టిష్ఠయొసంగగ మత్తవారణో
దంచితవాహినై సనిన ♦ దామలభేరికతోడ శంకరా. 7

శా॥ రాజ్యాభావమునన్ బుధప్రియవచో ♦ ప్రావీణ్యులై రాజ్య సా
మ్రాజ్యత్వంబున విత్త సౌఖ్యముల సం ♦ పద్గర్వవర్ధిష్ణులై
భాజ్యంబుల్విడనాడి కాలుకడ భూ♦పశ్రేణి వర్తింతు రా
'రాజ్యాంతే నరకం ధృవం' బనెడు ♦ నాశాస్త్రోక్తిగా శంకరా

మ॥ బలియాగారము నంటద్రవ్వి వన దివిన్ ♦ బ్రాకన్ త్రిలోకంబులున్
గలయం గ్రుమ్మర పూర్వదత్తఫలమే ♦ గన్పించుగా కెక్కడే
గొలదిం బొందరుగాన మానవులు జా ♦ గుల్ జేయకే ప్రొద్దు ని
ర్మల ధీవృత్తిని దానముల్ సలుప క్షే♦మంబబ్బుగా శంకరా. 79

మ॥ భువి సీమంతిని సోమవారముల సం♦పూర్తిన్ ద్విజశ్రేణులన్
సువధూయుక్తుల మీస్వరూపమని సం♦శుద్ధార్చనల్ జేయ వి
ప్రవరుండొక్కడు ద్రవ్యకాంక్షకుమతిన్ ♦ భామాకృతిన్ బూజనొం
ది విలాసంబుగ సిద్ధకాంతయగుచున్ ♦ దీపించెగా శంకరా. 80

చ॥ త్రిపురసురాహితప్రతతి ♦ ద్రుంచగ స్వారికి భూశతాంగమున్
తపనసుధాంశు చక్రములు ♦ ధాతయె చోదకు డబ్ధితూణమున్
యపరిమితప్రతాపుడగు ♦ నాదిభుజంగము నారి శౌరి తో
రపు శరమయ్యె మీ నటన♦రమ్యతరాద్భుత ముర్వి శంకరా.81

ఉ॥ చిత్తము నీవు పార్వతియె ♦ శేముషి ప్రాణములాప్తవర్గమ
త్యుత్తమ దేహమే గృహము ♦ నుర్విషయంబులె భోగకృత్యముల్
మత్తసుషుప్తియే విదిత ♦ మైన సమాధి పదప్రచారణం
బెత్తరియున్ ప్రదక్షిణము ♦ లీదృశవాక్చయముల్ స్తవంబు లో
చిత్తజవైరి నీ మయము ♦ సేవకుడన్ దరిజేర్చు శంకరా. 82

ఉ॥ దొడ్డదొరల్ శ్రితాళి గని♦దోచన ప్రేమ నభీష్టమిత్తు రెం
దడ్డము లేదు వారికి సు♦రాఘమునం దటులీవు భక్తులన్
మడ్డివదల్చి మోక్షమిడి ♦ మాన్యుల జేయగ డంగి పూన్కిగా
నొడ్డి ధరించితౌ బిరుద ♦ హో నెరిదాతవుగాన శంకరా. 83

చ॥ నిను కరమందు నిల్పుకొని ♦ నిశ్చలభక్తిని జూడజూడ నీ
ఘనతరమూర్తిలో వెలుగు ♦ గన్పడకున్న మహానుభావ నీ
వనిశముభక్తికిన్ సులభవైఖరి ♦ దృశ్యుడవట్టులౌట నిన్
గన శరణంబు వేడితిని ♦ కాలమిదే దయ బ్రోవు శంకరా. 84

శా॥ నీచిహ్నంబులు దాల్చువారలు తుదిన్ ♦ నీలోకముం జేరుటల్
సూచించున్ దగ కొన్నిగాథలును నా ♦ సుద్దుల్ నిజంబైన సం
కోచంబేమిక సర్వకాలము శివా ♦ కుండాకృతీధారకుల్
నీఘనమ్మూర్తిని లీనమౌదురుగదా ♦ నిక్కంబుగా శంకరా. 85

ఉ॥ ఇద్ధచరిత్రమైబరగు ♦ నీశతకంబిల నెవ్వరేని స
ద్బుద్ధిదలిర్ప బాడుదురొ ♦ పూర్వభవచ్యుతులై విభూత్యులై
వృద్ధినిజెంది దారసుత ♦ మిత్రులతోడుత సౌఖ్యమొందుటే
సిద్ధము వారు మీచరిత ♦ శ్రీకరమౌనటు జేసి శంకరా. 86

ఉ॥ సత్కవితాంగనామణికి ♦ మాన్యవరుండు త్రిలోకభర్త సం
పత్కరుడైన శర్వుడె వి ♦ భాసితుడౌనని నిశ్చయించివృ
త్తోత్కరరీతి నొప్పెడి మ ♦ దుక్తశతోన్నత పద్యసూనదా
మోత్కర మిచ్చగ్రీవమున ♦ నుంచితి గైకొనుమయ్య శంకరా.

ఉ॥ సాధ్యము నీదుభక్తి యని ♦ శంబు భవద్గుణ కీర్తనార్చనా
రాధ్యులకెద్దిజన్మము ప ♦ రాకుననేనియు నీదుచిహ్నవై
రుధ్యము లేక దాల్చిన న ♦ రుల్ భవదంతికవాసులైన ని
ర్బాధ్యమెగాక భక్తులకు ♦ పాపములుండునె జూడ శంకరా. 88

చ॥ కనకము నీదుదర్శనము ♦ కాయముదూల భజించువారికిన్
మనుజుడొకండు జీవహతి ♦ మ్రగ్గిపడుంగద దాననంబు ద్రొ
క్కిన శునకాంఘ్రిసంగత స ♦ కృద్భసితాస్యునకీవె మోక్ష ము
య్యన బాడసూపి కాలహర ♦ యంతకుడబ్బురమందె శంకరా. 89

శా॥ రాలన్ రువ్వెనొకండు మెంగిలిడె కూ ♦ రల్ జేసె పుత్రున్వధిన్
కాలుఁ ద్రొళ్లడగించెనొక్కఁడల భో ♦ గక్రీడ కాంతాంగనల్
కేళీకూటము కంపె నీకడకు త ♦ ర్కింపంగ నీభక్తులే
శీలస్వాంతులు మీదృశుల్ గద యిదే ♦ సిద్ధాంతమా శంకరా. 90

ఉ॥ భూతివిలేపనంబు భవ ♦ పూత శివాక్షమణిప్రధారణం
బాతతమంత్రరాజము జ ♦ పంబును లింగసమర్చనంబునూ
వే తలపంగ భక్తులకు ♦ వేగ తవాలయ గమ్యమార్గముల్
భూతిదముల్ మహాకలుష ♦ పుంజవిదూరములుర్వి శంకరా. 91

శా॥ ఏశాకోశముకాదు నీస్మరణ నే ♦ నేమార మారారి నా
శీలంబారసి దివ్యదర్శనము వా ♦ సిం జూపు ప్రముక్కెను న
న్నేలన్ నీకిది పెద్దకార్యమగునే ♦ యీశాన కాసంతయున్
జాలింజెందవిదేమి దిట్టతనమో ♦ చాతుర్యమో శంకరా. 92

శా॥ బాల్యంబజ్ఞతనేగు యౌవనము ద ♦ ల్పన్ కామబాణోద్ధతిన్
లౌల్యాంబై జను సత్కుటుంబభరణీ ♦ లంబౌను కౌమారముల్
మూల్యంబౌ నటమీద వృద్ధత జరా ♦ భోగాప్తిచే చిత్తచాం
చల్యంబౌ తరి నిన్భజించుటెటు సు ♦ స్వాంతంబునన్ శంకరా. 93

ఉ॥ కాలుఁడు పాశబద్ధుడని ♦ గ్రక్కున ప్రాణము దీయువేళ నీ
జోలి దలంతునన్న మది ♦ శోకవశంబగు గాన నిప్పుడే
జాలినయంత నీకొఱకు ♦ శర్వనుతి స్మరణార్చనాదులన్
శీలమతిన్భజింతు కృప ♦ జేకొని బ్రోవగదయ్య శంకరా. 94

మ॥ శివ నిన్వేడెద రెండుకోర్కులవి భా ♦ సిల్లుం తవాంచత్కృపా
సవిశేషంబున దేవదేవ వర దే ♦ శానా యనాయాస వం
భవ జీవోత్క్రమణంబు దైన్యరసమౌ ♦ వృక్ జీవనాడంబర
ప్రావీణ్యత్వము లేమి ఏనినిడగా ♦ ప్రార్థింతు నిన్ శంకరా. 95

శా॥ చేరందీసిన దీయకున్న హర నీ ♦ చిత్తంబు నాభాగ్యమం
చారూఢిన్ భవదీయ పాద♦యుగళార్చానందసంధానహృ
న్నీరేజస్థితినుంటి బ్రోవుమిక కా♦నీపోని వాఁడేల నీ
సాఁకారము భక్తివశ్యమనుచున్♦జాటున్ శ్రుతుల్ శంకరా. 96

ఉ॥ చెప్పితి భక్తియుక్తిదగ ♦ జెప్పితి నీతులు దోఁచినంతలో
చెప్పితి నంత్యనీమములు ♦ జెప్పితి భక్తచరిత్ర లాస్త చే
జెప్పితిగాని నే దెలిసి చె ♦ ప్పినవాఁడనుగాను గాన బల్
తప్పులుగల్గినన్విడచి ♦ తజ్ఞులు మెచ్చగజేయు శంకరా. 97

ఉ॥ మంగళమిందుచూడ జయ ♦ మంగళ మాశ్రితపోషకాల స
న్మంగళ మిందిరారమణ ♦ మానసవాస మహేశ ధూర్జటీ
మంగళమబ్ధితూణ శుభ ♦ మంగళ మీశ మునీంద్రవందితా
మంగళమంచు బాడెద సు♦మంగళమీకృతిజేయు శంకరా. 98

చ॥ జయజయ కాలకంఠ శివ ♦ చంద్రధరామరవంద్య భర్గ సం
జయనుత భక్తమానసవ ♦ శంకర తాండవఖేలవైరిరాట్
జయ భయదూర భాస్కరశ♦శాంకవహ్నితాశననేత్ర యొల్లెడన్
జయమగునీకు నీకృతికి ♦ సంతసమందగదయ్య శంకరా. 99

మ॥ ధర చామర్తికులీన మంత్రివర ప ♦ ద్మయార్యసుబ్బాంబికో
దరసంజాతుడ కణ్వగోత్రజుడ న ♦ దృత్తావకార్చారతి
స్ఫురణానందుడ శంభులింగకవినా ♦ బాల్పొంది నిర్మించితిన్
చిరమీ వృత్తశతప్రసూనముల పూ♦జింతున్ సదా శంకరా. 100

సంపూర్ణము.



# ఈశ్వర దండకము.

(మహాభారతము.)



శ్రీకంఠ, లోకేశ, లోకోద్భవస్థాన సంహారకారీ, మురారి
ప్రియా, చంద్రధారీ, మహేంద్రాది బృందారకానంద సందోహ
సంధాయి, పుణ్యస్వరూపా, విరూపాక్ష, దక్షాధ్వర ధ్వంసకా,
దేవ, నీదైనతత్వంబు భావించి బుద్ధింబ్రధానంబు గర్మంబు విజ్ఞాన
మధ్యాత్మయోగంబు సర్వక్రియాకారణంబంచు నానాప్రకారంబులం
బుద్ధిమంతుల్ విచారించుచో నిన్ను భావింతు రీశాన, సర్వేశ్వరా
శర్వసర్వజ్ఞ, సర్వాత్మకా, నిర్వికల్పప్రభావా, భవానీపతీ, నీవులోక
త్రయీవర్తనంబుల్ మహీవాయుఖాత్మాగ్ని సోమార్కతోయంబు
లంజేసి కావించి సంసారచక్రక్రియా యంత్రవాహుండవై తాది
దేవా మహాదేవ, నిత్యంబు నత్యంత యోగస్థితి న్నిర్మల జ్ఞానదీప
ప్రభాజాల విధ్వస్త నిస్సారసంసార మాయాంధకారుల్ జితక్రోధ
రోగాదిదోషుల్ యతీంద్రుల్ యతాత్ముల్ భవత్పాదపంకేరుహ
ధ్యానపీయూష ధారానుభూతిన్ సదాతృప్తులై రవ్యయా,
భవ్యసేవ్యా, భవా, భర్గభట్టారకా భార్గవాగస్త్య కుత్సాది నానా
మునిస్తోత్ర దత్తావధానా, లలాటేక్షణోగ్రాగ్ని భస్మీకృతానంగ,
భస్మానులిప్తాంగ, గంగాధరా, నీప్రసాదంబునన్ సర్వగీర్వాణ
గంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రామరేంద్రాదులున్ శాశ్వ
తైశ్వర్య సంప్రాప్తులై రీశ్వరా, విశ్వకర్తా, సురాభ్యర్చితా, నాకు
నభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ, త్రిలోకైకనాథా,
మహాదేవ, దేవా, నమస్తే నమస్తే నమః.

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.



# విజయనగరం సిటీ.

ఇయ్యది శ్రీ బుద్ధిరాజు సుబ్బమాంబ స్మారకధర్మనిధిభివృద్ధ్యర్థము నెలకొల్పబడినది. సంవత్సరమునకు మూడుగ్రంథములకు తక్కువకాకుండ వెలువడును. దీనిపై వచ్చు విరాళము బీదబాలుర విద్యాభివృద్ధికిని దీనజనపోషణమునకును వినియోగింపబడును. కావున తాము చందాదారులుగాచేరి తమ బంధుమిత్రులనుకూ ప్రోత్సహించి మాకు సానుభూతినొసంగ ప్రార్థితులు.

| | | | |
|---|---|---|---|
| చందాదారులు సాలుకి | | | రు. 3—0—0. |
| అభిమానులు | ... | ... | ... 5—0—0. |
| పోషకులు | ... | ... | ... 10—0—0. |
| రాజపోషకులు | ... | ... | ... 25—0—0. |

పైన యథోచితము.

సెక్రెటరీ, కాకులపాటి కృష్ణమూర్తి.

---



గ్రంథకర్త:— కాకులపాటి కృష్ణమూర్తిగారు. రు. **1.**

„ఈ గ్రంథము తెలుగుభాషకు మిక్కిలి యావశ్యకమైనది. లోకకల్యాణమునకై యవతరించిన యిందలి మహాపురుషుల జీవితములు జన సామాన్యమునకు కరతలామలకములై పరమార్థ సిద్ధి సాధనములు కాగలవు. ... ..." వడ్డాది సుబ్బారాయుడు.

# మోహిని

గ్రంథకర్త:— కాకులపాటి గురుమూర్తిగారు, బి. ఏ., రు. **1.**

„ఈ నాటకమందలి పాత్రపోషణ బాగున్నది. వ్యతిరేక విషయములు ( Conflicting elements ) కలవు. భక్తిరసము పొంగి పొరలుచున్నది. శైలి సులభముగను మధురముగనున్నది."

భారతి మాసపత్రిక.

# హాహూ.

ఇంపుగొల్పు క్రొత్తసాంఘికనవల. రు. ***1—0—0.***

గ్రంథకర్త:— కాకులపాటి గురుమూర్తిగారు, బి. ఏ.,

మరా:— పై మూడుపుస్తకములు ఒకేమారు కొనువారికి రు. 2—0—0. లకే పంపబడును. పోస్టేజి ప్రత్యేకం.

ప్రతులకు:— వేణుగోపాల్ ప్రెస్,

విజయనగరం సిటీ.